# ఈశ్వరతారావళి

వ్రాసిన

జనమంచి సీతారామస్వామి,

సహాయోపాధ్యాయుఁడు,

ఆర్. సి. హెచ్. హైస్కూలు,

పిఠాపురము.



శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షర
శాలయందు ముద్రింపఁబడినది.
పిఠాపురము.
1921.
వెల రు 0-1-6.

ఓం.

# ఈశ్వరతారావళి

---

కృతి

జనమంచి సీత[illegible]

సహాయోపాధ్యాయుఁడు,

ఆర్. సి. హెచ్. హైస్కూలు,

పిఠాపురము.

---

రెండవకూర్పు 500.

---



శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

పిఠాపురము.

1921.

వెల రు 0—1—6.

ఓం.

# విజ్ఞప్తి.

భక్త్యమృతంబును సహృదయహృదయంగమంబుగ విందుసేయు భాగవతాదిపురాణరత్నంబులును, శతకరాజంబులును, దారావళులును తెలుఁగున నెన్నఁడుగనున్నవని యూహింపఁగ యు నేనీచిన్నపొత్తముఁ బ్రకటింప సాహసించుటకుఁ బ్రథానహేతువు మిత్రవర్గప్రోత్సాహాతిశయము దక్క మఱొకఁడు గాదు. మదనుభవజనితంబులైన యభిప్రాయంబుల నిందు వెల్లడించితిని. ఇది చదివి యొక్కఁడానందించినను నిక్కంబుగ ధన్యుఁడననియే భావింతు.

ఇది రెండవకూర్పు. ప్రథమముద్రణములోని పద్యములు కొన్ని తీసివేసి, క్రొత్తవి కొన్ని చేర్చితిని. పాఠకమహాశయు లిందలి గుణలేశంబుమాత్రమే గ్రహింపఁ బ్రార్థితులు.

"గీ. చేతులారంగ శివుని బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
గలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు."

పిఠాపురము.
26-9-1921.

జనమంచి సీతారామస్వామి.

ఓం.

# ఈశ్వరతారావళి.

---

ఉ. శ్రీరమణుండ వీవనియు
        ఱంగియు సంపదలిమ్మటంచు ని
న్గోరనుగాని నీకొఱకుఁ
        గూర్చెద వాక్సుమదామమెంతయో
భూరిమితోడఁ; దోడ్పడుము;
        కొంచెపువాఁడని వీడఁబోక, నా
నేరము లెంచఁబోక మది
        నిల్పుమి నెయ్యమువీడ నీశ్వరా. 1

ఉ. ఎంతగఁ గొట్టుకొన్న మన
        సెన్నఁడు నీవయి నిల్వలేదహో!
చింత మునుంగుచుండుఁ, బలు
        చిక్కులఁ ద్రోయుచునుండు, నెప్డుడు

ర్భ్రాంతులఁ బట్టియుండు, గరు
వంబుననిక్కి, యర్థేచ్ఛఁదిర్గఁ, గా
నంత సుఖంబులేదు నిజ
మయ్య కృపామతిఁగావు మీశ్వరా. 2

ఉ. అక్కఱలేదు వాహనము,
లక్కఱలేదు యశంబు, స్తోత్రిమా
యక్కఱలేదు, జవ్వనులు
నక్కఱలే దధికారయోగమా
యక్కఱలేదు, నిక్కముగ
నక్కఱలే దిల నెట్టిభోగముల్
చిక్కులు పెట్టకుండ ననుఁ
జెంతను జేర్చినఁజాలు నీశ్వరా. 3

చ. వినయముఁ దోఁపనీదు; మద
వృద్ధికిఁ దోడ్పడుఁ; బెంచు గర్వముఁ;
గనులను జూడనీదు; మఱి
కర్ణములన్వినీదు; బంధుల
న్మనుపటియట్లు సన్నిధికిఁ
బోవఁగనీ దధికారరోగమే

మనుజుని( బట్టుకొన్న(; దగు
మందునొసంగి కుదుర్చ(జాలు వై
ద్యుని(గన మీభువిన్ సకల
దుర్గదహారివి నీవ యీశ్వరా. 4

చ. కలిమి యనర్థమంచు( బలు
కందగుమాట నిజంబ; కాని, యా
కలిమికినున్నశక్తి మతి
కల్గున దేనికైన(? గల్మిచే
ఖలు(డును నీకులేని ఘన
గౌరవమొందుచు, విద్యనేర్చువా
రల నిల( ద్రోసిరాజని, ని
రంకుశు( డౌనుగదయ్య యీశ్వరా. 5

చ. పదపదరాయటంచు ధన
వంతుల సేవకులీడ్చుచుండ(గా,
సదయత( జూడ కేయనుచు
సా(గిలి మ్రొక్కుచు( బొట్టకోసమే
గద యవమాన మెంతయిన(
గాంచి సహింతురి దరిద్రు లక్కటా!

యుదరమునిచ్చి యన్నమిడ
కుండుట న్యాయమె నీకు నీశ్వరా. 6

చ. వనితలపొందు కూడదని
పల్కుచు నీతులు చెప్పువారలే
వనితనుగాంచిన న్దలలు
వాల్ప కెగాదిగఁ జూతు రేలొకో?
మనుజుల మెప్పునొందఁగల
మాటల నాడఁగవచ్చుఁగాని, యా
మనసునుబట్టి గెల్వఁగల
మానవుఁ డెక్కడనుండు నీశ్వరా. 7

ఉ. అన్నిపరీక్షలందు జయ
మందిన, వేతన మెంత తెచ్చినన్
మన్నన నెంతపొందినను
మాటల నెంతటి వ్రిజ్ఞఁజూపినన్
బున్నము నొందలేఁడుగద
పూరుషుఁ డెవ్వఁడు నీతిలేనిచోఁ
దిన్నఁగదిద్ది నానడతఁ
దీర్పవె నావరితావ మీశ్వరా. 8

ఉ. వంతముఁ బూనినట్లు వలు
        బాములఁ బెట్టుట నీకుఁ బాడియే ?
యింతగఁ గష్టపెట్టెదవొ !
        యెవ్వఁడు నిన్ను మదిన్దలంతు నీ
వింతయుపేక్ష చేసిన మ
        తెవ్వరు దిక్కు మహానుభావ నా
చింతలఁదీర్చి శాంతిదయ
        సేయు మనాథసుమిత్ర ? యీశ్వరా. 9

చ. తెలియక కొన్నియున్దెలిసి
        తెంపున నెన్నియొ ఘోరపాపముల్
పలుకులఁ జేఁతలన్మఱియు
        భావముచే నొనరించి నందున
న్దలఁచి, తలంచి వాని, నను
        తాపముఁ నొందెడి నన్నుఁ బ్రోవఁగ
న్వలుమఱు నీదు నామమును
        భక్తి జపింతును దండ్రి, యీశ్వరా.10

ఉ. పుట్టిననాఁటనుండియును
        బొట్టకు బట్టకు దేవులాడు నే

నెట్టులు నిన్నుఁ గొల్వఁగల?
నెవ్వఁడు హాయిగనుండుఁ బ్రాణిమి
కట్టులఁబాసి? నీవరపు
కారుణికత్వముఁ జూపవేల? నీ
కిట్టిపరాకుగల్గిన మ
రెవ్వరు రక్షకులౌదు రీశ్వరా. 11

ఉ. తప్పనియెంచ కెందఱినొ
దాసులపోలిక నాశ్రయించుచు
జెప్పఁగరాని దుష్క్రియలు
చేయుచు విత్తముఁగూర్ప మోక్షమే?
యెవ్వఁడు డబ్బుడబ్బనుచు
సేవలుపాట్లు వడంగనేల? ని
న్దప్పక కొల్చుభాగ్యమును
దప్ప మఱేమియుఁగోర నీశ్వరా. 12

చ. తనువు ననుగ్రహించితివి
తావక సేవకుఁగాదె? కాని నీ
కనికరమున్నఁగాని యెటు
కల్గును మాకటువంటిభాగ్య? మే

ననయము దుష్పథంబుననె
యంధుఁడనై చరియించుచుంటి; నా
మనవిని జిత్తగించి యిఁక
మక్కువతో నను జ్ఞానిఁజేయవే
తనయుఁడు తప్పొనర్చినను
దండ్రికిఁ దప్పునె ప్రేమ మీశ్వరా. 13

చ. మును దనుజాత్మజున్గరిని
ముప్పునబీడక కాచినాడవం
చు నుతులుసేయనేల? యది
చోద్యమె? యాశ్రితలోల దీనుల
న్మనుచుట నీకు దీక్షగద
మమ్ములమ్మాత్రము చూడకుండువా
యని మది నమ్మియుంటి నిఁక
నైనను సౌఖ్యమొసంగు మీశ్వరా. 14

మ. సిరియున్నందునఁగాక వేఱుగతిఁ గొం
చెంబేనియు న్గౌరవా
దరసేవార్హతలేనిమానవుల చెం
తంజేరి మండాడుచు

ద్ధరపై జీవనయాత్రినల్పు టతిచిం
తా హేతువౌ నక్కటా!
పరులన్వేఁడుటకంటె సజ్జనునకా
పత్తేది సర్వేశ్వరా. 15

చ. సిరులన్నరోసి సంతతముఁ
జిత్తము సేవయినిల్పినాఁడు; నీ
చరితముఁ దేనెలుట్టిపడఁ
జక్కనియాంధ్రమునందువ్రాసి, తా
నొరుఁగృతిభర్తఁ జేయుటకు
నొల్లక నీకది యిచ్చి తృప్తుఁడై
వఱలినవాఁడు పోతన; యొ
వండిల నాతనిసాటి యీశ్వరా. 16

మ. కృతిలో దోషములెంచి యెంచి కపినా
క్షేపించు టేమింతగా
వ్వతనం బాకవిశక్తు మాట్టిదియొ కా
వ్యంబుల్లు ప్రౌఢుండగా
కితరుల్గాంచఁగలేరు; బిడ్డఁగనువ
న్నే బాధ చూలాలికిన్

క్షితిపైఁగల్గునో గొడ్డురాలెఱుఁగునే
చెప్పంగ ? సర్వేశ్వరా. 17

ఉ. ఎంతగనర్థమున్న మన
క్షేమియు సౌఖ్యమొసంగలేదు ; కా
వంతయుఁ దోడ నుంచుకొనఁ
జాలము ప్రాణములూడిపోవుచో ;
నంతటిదానికేల జను
లందఱు మోహముఁ జెందుచుందురో?
యంతయు నింద్రజాలమయి
నట్టులు తోఁచును నాకు నీశ్వరా. 18

మ. సదయాత్మ్సుండవుగాన నిచ్చలును మా
సంరక్షణార్థంబె చే
యుదువే కార్యమొనర్చిన న్నరణి మే
మున్నంతకాలంబు, నా
కదియీవే యిదియీవెయంచు మనుజుం
డజ్ఞానిమై నిన్నుఁ దా
మదిఁ బ్రార్థింపఁగనేల ? నీవరయవే
మామేలు సర్వేశ్వరా. 19

చక్కఁగఁజాటు నీమహిమ
సర్వము నద్భుతలీల ; నందియుం
బెక్కఁడిదింక ? "నాస్తికుఁడ
నే" నను మాధుఁడుగూడ రాత్రియం
దక్కజమంది నిన్హృదయ
మందుఁ దలంపకయున్నె యీశ్వరా. 24

ఉ. రావణుఁజంప ధాత్రి రఘు
రాముఁడవై జనియించినప్పు డా
పావనమూర్తియౌ హనుమ
భక్తి సుధాంబుధిమున్గి నిన్ను సీ
తావనితామతల్లిని స
తంబును గొల్చినరీతి నేనునీ
సేవయొనర్చు టెన్నఁటికిఁ
జేకుఱునో గద తండ్రి, యీశ్వరా. 25

ఉ. మానవజన్మ దుర్లభము
మాధవ సేవను మానఁబోకుఁడో
మానవులార యంచు మతి
మంతులు పల్కుదు రైననేమి ? య

జ్ఞానుల కెట్లుకల్గు సువి
చారము నీదయ లేకపోయినన్
నే నవివేకిఁగానఁ గరు
ణించి నన్నున్ సవరింపుమీశ్వరా. 26

ఉ. చేయఁగనేర జన్నములు;
చేయఁగనేరఁ దపంబు లేవియు
న్జేయఁగనేర దానములు;
చేయఁగనేరను దీర్థయాత్రల
న్జేయఁగనేర శాస్త్రములు
చెప్పినచొప్పునఁ గర్మ మేదియున్
మాయలులేక తెల్పితిని
మాయలువన్నక ప్రోవుమీశ్వరా. 27

---

చ. ఎఱుఁగను వేదశాస్త్రముల;
నేమియు వ్యాకరణంబురాదు; నా
కరయఁ గవిత్వమందు నిసు
మంతయు నేరుపులేదు తండ్రి నీ

కరుణనుమాత్ర నమ్మితిని;
గావున దీనిఁ బరిగ్రహింపుమే
యఱమరలేక యంచు విన
యమ్మున వేఁడుదు నిన్ను నీశ్వరా.

క. నీమంబున వ్రాసితి నిది
స్వామీ, మాయింటిపేరు "జనమంచి" యయా,
నామంబన్ననొ "సీతా
రామస్వామీ" యనియెదవు రమ్యగుణాబ్ధీ.

